మును నుపదేశించుచున్నవి. పౌరసేవోద్యోగములకు యువకుల నాకర్షించుటకు విశ్వప్రయత్నములు జరుగుచున్నవి. ముడ్డీమను కమిటి రిపోర్టుగతి యేమైనదియును దెలియకున్నది. నిరంకుశధ్వజారోహకులు శ్వేతభవనమునందు సమావిష్టులై భారతరాజ్యాంగగతిని యథేచ్ఛను నిర్ణయించుచున్నను సన్నిహితసంబంధముగల భారతీయులకుమాత్రము జోక్యమును గలుగజేసికొనుట కవకాశములు గనుపడవు.

రాజ్యాంగసమయజ్ఞుల దృష్టి దేశబంధుదాసుగారిమీదను లగ్నమగుచున్నది. స్వీయమిత్రానుచరులు నిర్బంధితులై స్వపక్షావలంబనులుభిన్నాభిప్రాయులైఅనారోగ్యమునుగలిగి విషమస్థితియందున్న దేశబంధుదాసుగా రేమి చేయనున్నదియును కాలము తెలుపగలదు. నామమాత్రావశిష్టమైన అసహాయోద్యమమునకు ఫరీదుపురపు సంప్రతింపులును, దాసు బర్కెనుహెడు సంప్రతింపులును, రీడింగు బర్కెనుహెడు మంత్రాంగములును, నిహెరుల మందలింపులును, ప్రజల నిరుత్సాహమును మంగళహారతి నిచ్చుటయందు విచిత్రము గనుపడదు.

* * * *

గాంధిదాసుల యొడంబడికలు

గతసంవత్సరమునందు ఉభయులకును జరిగినయొడంబడిక కనురూపముగను గాంధిమహాత్ముడు ప్రవర్తించుచు నుభయపక్షములకును ధర్మారాధన విధానమును ప్రత్యక్షము చేయుచున్నాడు. మీర్జాపురము పార్కునందు గాంధిమహాత్ముడు రాజ్యాంగశాఖను దేశబంధు స్వాధీనము చేసినటులను వారిప్రయత్నములకు సంపూర్ణమైన సహాయమును జేయదలచినటులను తెలియజేసెను. అవసరమైనపుడు వారిప్రయత్నములకు దోడ్పడుటకును నంగీకారమును సూచించెను. గాంధిమహాత్ముని సంచారము స్వరాజ్యపక్షప్రచారమున కనుకూలముగాని ప్రతికూలము గాదని విశదముచేసెను. రాజ్యతంత్రనిపుణులయిన యధికారులతో సంధి ప్రయత్నములను జేయుటకు దనకు సామర్థ్యములేదని మహాత్ముడు తెలియజేసెను. ఆ సామర్థ్యము భరతవర్షమునకు గలుగుటకు నిర్మాణ విధానావసరమును విశదముచేసెను. రూపారోడు మందిరవిషయమునను దేశబంధుదాసుగారి విషయమునను మహాత్ముడు దెలిపిన విషాదము సామాన్యప్రచారకులపట్ల ననేకరెట్లుగను నన్వయించుచున్నది. త్యాగనిర్ణయమును దశాస్థితులభేదము ననుసరించకను నిర్ణయింపదగియున్నది. ప్రచారకు లెందరోపడుచున్నపాట్లును, పనిలేక పరితపించుటయును వర్తమాన విషాదస్థితికి గారణమని యనుభవజ్ఞులకు దెలిసియున్నది. దాసుగారి సంస్మరణమునందె మహాత్ముని లక్ష్యమునందీ త్యాగపురుషులందరును గలరని మహాత్ముని భావములు విశదముచేయుచున్నవి. ప్రజలును ప్రచారకులును నిరుత్సాహభరితులయి కర్తవ్యము దోచకను పరితపించుచున్నవిధమును నిత్యవ్యవహారానుభవము విశదము చేయుచున్నది.

ఫరీదుపురము సంప్రతింపులకును వంగదేశ పర్యటనమునకును ఫలమేమైనను దేశబంధు దాసుగారి వ్యవహారాచరణమునకు మహాత్ము డభయహస్త మొసంగునని వారి ప్రసంగాచరణములు విశదము చేయుచున్నవి. వివాదములకు మూలమైన యఖిలభారత జాతీయోపసంఘమును సమావేశము చేయక పోవుటయె మహాత్ముని సహనశీలమును కార్యదీక్షను విశదము చేయుచున్నవి. మహాత్ముడు తన విశ్వాసము నిర్మాణవిధానమునందు లగ్నమైనను దేశబంధు దాసుగారి కధికారవర్గముతో రాయభారమును నడుపుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగుటయును సహజము. సకలవిధములను రాజ్యాంగరంగమునందు నూతనరంగ మాసన్నముగనున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. మహాత్ముని పర్యటనము ఫరీదుపురము సంప్రతింపులు దాసు బర్కెను హెడు రాయబారములు రాజ్యాంగరంగమునందు నూతనాభినయమును గలుగజేయుట సంభవము.

* * * *

నిర్మాణవిధానము

గాంధిమహాత్ము డేప్రాంతమునకు బోయి ఖద్దరుసందేశమునే పూరించుచున్నాడు. రాజ్యసిద్ధికి అస్పృశ్యతానివారణము, వివిధ ములకు సంయోగము, ఖద్దరున కండలుగనున్నవి. త్రివిధములైన సాధనములును ననుభవ సిద్ధము గానంతవరకును స్వరాజ్యము దుర్లభమని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. మహాత్ముడు దాసుగారితో జేసిన నియమానుసారముగను రాజ్యాంగాందోళనభాగమును స్వరాజ్యపక్షాధీనము చేసి వారివ్యవహారక్రమమున కేవిధమైన యాటంకములును గలుగకుండునటుల ప్రవర్తించుచున్నాడు. మహాత్మునకు దాసు నెహ్రూగారల పట్లగల భక్తివిశ్వాసములు స్వరాజ్యపక్షము పట్లగల భక్తివిశ్వాసములను విశదము చేయుచున్నది. దేశమోక్షమునకును స్వరాజ్యప్రాప్తికిని నిర్మాణవిధానమే శరణ్యమని దేశబంధు దాసుగారును వారియనుచరులును నంగీకరించినను వారిలక్ష్యము శాసనసభలమీదను స్థానికసంస్థలమీదను · లగ్నమై నిర్మాణవిధానము దుస్తరమగుచున్నది. కాలమంతయును స్థానికసంస్థలందును ఖండనమండనములందును వినియోగపడునపుడు నిర్మాణవిధానమునందు మహాత్ముడు కోరునటు లుత్సాహముతో నిమగ్నమగుట యసంభవము. కాంగ్రెసుప్రచారకులు క్రమముగను వెనుకబడుచు స్వరాజ్యపక్షావరణమునందు జేరుచున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నది.

గాంధిమహాత్ముడు త్యాగధైర్యములును నాత్మవిశ్వాసమును గల కార్యపరతంత్రులు చేయగలది విశేషమున్నను లేకుండుటకు విచారమును దెలుపుచున్నాడు. మానవులకు నిష్కామకర్మను జేయుట యుత్తమమైనను ప్రయోజనము లేకను కర్మను జేయుట దుర్లభముగనున్నది. నాయకులు ప్రచార

కులు స్వరాజ్యపక్షావరణమునందు జేరుటకుగల కారణము ప్రయోజనాపేక్షయని విశదమగు చున్నది. ఉద్రేకపూరితులైన యువజనుల యందు సన్న్యాసశీలమును గనుగొనుట దుస్తరము. నిర్మాణవిధానము ప్రబలుటకును సఫలమగుటకును ప్రచారకులకు ప్రయోజనమును సయితము గలుగజేయుట యవసరమని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

ఈయవసరమును గ్రహించి దేశబంధుదాసు వహించిన స్వరాజ్యపక్ష నాయకత్వమునకు గాంధిమహాత్ముడభయహస్తము నొసంగుచున్నను నుద్యమప్రాబల్యమునకు ప్రయోజన వ్యాపన మవసరంబగుచున్నది. ఇతర ప్రయోజనములందు లక్ష్యమును నిలుపజాలని వారలలక్ష్యముధిక్కారతిరస్కారములందును, నిందాక్షేపణలందును, రంధ్రాన్వేషణములందును, నిమగ్నమగుచు విషాదమయమైన దేశమునందు సంక్షోభమునకు గారణంబగు చున్నది. దృష్టిని నితరులలోపములను, వ్యవహారములను పరిశీలించుటకు వినియోగించుట దేశాభివృద్ధికి ప్రయోజనకరముగాదు. గాంధిమహాత్ముని యాస్తివిషయమై ప్రశ్నించుటగాని, యితరుల యుద్దేశములను శంకించుటగాని, తప్పుల నెన్నుటగాని, సంక్షోభమునకు సాధనంబగుచున్నదిగాని బలశాంతులకు సాధనం బగుటలేదు. ప్రజలిసందర్భములను గ్రహించి వారిదృష్టిని స్వధర్మారాధనమునకు వినియోగించుట శ్రేయస్కరము. దేశావృతంబైన సంక్షోభమును బాపుటకు దేశబంధుదాసు గాంధిమహాత్ముడు చేయుచున్న విశ్వప్రయత్నములను ప్రజలు పాలించి స్వీయసంస్కారమున కనురూపముగను స్వధర్మారాధనమును జేసి కృతకృత్యులగుదురు గాక!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.